# శ్రీ దత్తాత్రేయ జననము.

## మానస పూజ.

బ్రహ్మాండం నరసింహ రా[illegible]

విరచితము.

శ్రీ శివ చరణ శాస్త్రి గారిచే

సుపరిష్కృతము.

ప్రథమ ముద్రణము — ప్ర. ౧౦౦౦

పంచాక్షరీ ప్రెస్సు నందు

సుముద్రితము.

చౌట్లమహారాజుగంజు - హైద్రాబాదు (దక్క-)

శ్రీముఖ సం॥ జ్యేష్ఠ శు॥ 3.

౧౯33 మే.

## శ్రీ దత్తాత్రేయ జననము;

## మానస పూజ.

---

గీ. అయినవుల గోత్ర వర్ధను డార్యవణిజ
వరుడు డోగిపర్తి సువంశ భవుడు విష్ణు
భక్తవర్యుడు వెంకన్నపత్ని సాధ్వి
అంతమాంబిక యీ గ్రంథమచ్చు గాగ
ధనము నర్పించె సద్భక్తి ధాత్రి వెలయ.

ఇతి శ్రీః.

---

౪ వ పే. 3 వ పం. లో జెలంగెడు అను నది తప్పు;
జెలంగు అవి ఒప్పు.

ఓమ్

శ్రీదత్తాత్రేయాయ నమః.

శ్రీమేధాదక్షిణామూర్తయే నమః.

శ్రీమత్త్రిపురసుందర్యై నమః.

ఉ. శ్రీరమణీమణీధవుడ
శేష చరాచర జంతు సృష్టి సం
హారుడు పోషణుండును ద
యామయుడున్ యనసూయసాధ్వి, యా
చారత నిల్పినట్టి సుర
తాపసవంద్యుడు కేశవుండు నా
వారిజనేత్రుడవ్యయు డ
పారకృపన్ మము నేలుగావుతన్.

ఉ. సారసనేత్రుడౌ హరియు
శర్వుడు ధాతయు నొక్కరూప మే
పారగ వేల్పుతాపసుల
భావము రంజిల మూడుమోములున్
యారుకరంబు లొప్పి కడు
హర్షమునన్ మునివేషధారియై
ధారుణి దత్తుడై బరగు
దైవము గొల్తు నభీష్టసిద్ధికిన్.

## శ్రీ దత్తాత్రేయ జననము.

క. గజవక్త్రుని హేరంబుని
యజురాణిని ధరణిసుతను యార్యాదేవిన్
త్రిజగత్కర్తల సతతము
భజియించెద విఘ్నములను బారగఁదోలన్.

క. రాముని ముద్రిక గైకొని
భూమిజ గని కుశలవార్త భూమీశునకున్
ప్రేమజనింపగ దెల్పిన
ధీమతి పవనజుని గొలతు తీరని భక్తిన్.

గీ. వ్యాసు వాల్మీకి భవభూతి భాణు దండి
కాళిదాసు మయూరు తిక్కనను నన్న
పార్యు పెద్దన భాస్కరు పాపరాజు
యాదిగాగల గీర్వాణ యాంధ్రకవుల
సంస్మరించెద భక్తితో సంతసమున.

గీ. అన్యులు రచించు కావ్యము లందు చపల
స్వాంతమున దోసముల నెంచు స్వాము లెలమి
కూర్మి జూపుదు రంచను కోరి కలరి
పండితాళిని భక్తిమై బ్రస్తుతింతు.

క. కృతిపతియై భక్తాళికి
యతికుతుకం బొదవ భువిని యాచంద్రార్కం
బతులిత కృపనేలుచు సం
తత శుభముల నందజేయ దత్తుని గొలతున్.

గీ. భక్తి ముక్తికి భక్తియే మూలబీజ
మనెడి విజ్ఞానభావంబు మది జనింప
శ్రవణ పఠనాది యోగ్యమౌ చరిత మగుట
వ్రాసినాడను యశ మిల వర్ధిలంగ.

గీ. మహిత శ్రీవత్స గోత్ర బ్రహ్మాండవంశ
గంగరాజాఖ్య మహాలక్ష్మి గర్భజనితు
లైనవారిలో జ్యేష్ఠుడ నవనిసురుడ
ధరను రేపల్లెవాసుడ దత్తమూర్తి.

క. నరసింహరాయవరుడను
హరురాణిపదంబు లెపుడు యతులితభక్తిన్
నెరనమ్మి గొలుచు దాసుడ
ధరణిని రామేశ్వర గిరీశ దత్తాత్రేయా.

క. మురిపెము దీరగ సత్కవి
వరుపై సత్కరుణ యుంచి భక్తియుతంబౌ
చరితము శశి తారార్కము
ధర వర్ధిల జేయుమయ్య దత్తాత్రేయా.

గీ. వసుధ నైజాము నను రాయపట్టణమున
జననమై కాకినాడను సమ్మతిగను
కంచిరాయప్పపంతులుగారి పూర్ణ
దయను విద్యలు నేర్చితి దత్తమూర్తి.

గీ. అయిల సోమయాజుల పాపయార్యగురుడు
జన్మరాహిత్య మానట్టి సాధనముగ
మంత్ర మంత్రార్థ యామ్నాయ మర్మములను
దయను బోధించ గైకొంటి దత్తమూర్తి.

క. హారితసగోత్రుడు విప్రుడు
వరకోటయ పుల్లమాంబవరులకు సుతుడై
హరిదాసు రామయాఖ్యుడు
ధర కవితను పెంపుజేసె దత్తాత్రేయా.

ఉ. వేంకటరంగనాయకియు
వేడ్క జెలంగెడు సరస్వతీ యనన్
పంకజనేత్ర లిర్వురు సు
పత్నులు ధర్మహితానుసారులున్
వేంకటయప్పరాయడను
విజ్ఞుడు దత్త సుపుత్రకుండునున్
శాంకరి సత్కృప న్గలుగ
సద్యశ మొందితి దత్తచంద్రమా.

క. దురితపు ఘనసంహారణము
సరగున సేయంగగోరి సద్భక్తితో నీ
చరితకు నధిపతి జేసితి
ధర ఘనతను జెందజేయు దత్తాత్రేయా.

క. రారా! దాసులకోరిక
లీరా, నీ చిద్విలాస లీలల బ్రోగదక్,
నేర రని వీడబోకుము:
ధారాధర! కరుణ నేలు దత్తాత్రేయా.

క. అనసూయకు దత్తునిగా
ఘన మూర్తిత్రయ మొసంగ కరుణాళుడవై,
ముని సుర నుతుఁడవు నగుచును
దనరెడి నీ కృపను జూపు దత్తాత్రేయా.

సర్వ సాక్షియు, సర్వ వ్యాపకుడును, సర్వాంతర్యామియు, సచ్చిదానందుడును నగు పరమేశ్వరుని యందు చిత్తము నిల్పి, తపోనిష్ఠ నున్న యత్రిమహాముని భక్తికి మెచ్చి, హృషీకేశుడు సాక్షాత్కరించిన నమ్మౌని, మాయాబద్ధుడగుట పుత్రవాత్సల్యమును సూచించెను. నారాయణుం డా సన్న నెరింగి, ఎల్లపుడు మిమ్మానందాబ్ధి నోలలాడింప దగు రూపము నీ యాశ్రమమునం దావిర్భవింపగల దని వరం బొసంగి యంతర్హితుం డయ్యెను.

ఇంతలో నమ్మునిపత్ని యగు యనసూయాదేవియు పుత్రవ్యామోహమును జెందియుండ బ్రహ్మమానసపుత్రుండగు నారదు డరుదెంచి, మయబ్రహ్మ

చేత లభ్యమైన యీ యుక్కుశనగల పచనము జేసి యీయుమని కోర, నామె కరస్పర్శనము గావించి నంతనే మెత్త నగుటచే గైకొని, తనకు మృష్టాన్న భోజన మమరినందులకు సంతసించి, వెడలి లక్ష్మీ సరస్వతీ పార్వతు లొక్కచో నుండుటెఱింగి, యచటి కేగి, ముగురమ్మలకు మ్రొక్కి, కుశలంబడిగి, అనసూయను పలువిధంబుల గొనియాడి చనెను.

నారదు పలుకులకు వారుమువ్వురు కినుక జెంది తాపసాంగన సతీత్వమును పలుతెరంగుల బరీక్షించి, తమ సంకల్ప మీడేరనందులకు విసిగి వేసరి, తుదకు పతులమూలమున పతివ్రతా మాన భంగ మొనరింప నిశ్చయపరచుకొని, తమ పతులకు విశదపరచిరి.

బ్రహ్మ విష్ణు మహేశ్వరు లెట్టకేలకు సతుల కోరికల సమ్మతించిరి. అనసూయ సతీత్వము నాచంద్రార్కస్థాయి సేయ దలంపుగొనిరి; జడదారులై సత్వరమ మునియాశ్రమము జేరిరి; "భవతి భిక్షాం దేహి" యని యాచించిరి; అనసూయ వారల గని సంభ్రమమున సపర్య లొనర్చి, యాతిథ్య మిడెద నని జెప్పగా, వారు మువ్వురును, ఓ సాధ్వీమణీ! వివస్త్రవగుచు మాకు భోజన మిడు మనిరి.

అంత నా సాధ్వి దిగ్భ్రమ జెంది, కొంతవడికి ధైర్యము వహించి, తన పతిని జగత్పతిని మనమున ధ్యానించి, కరములు మోడ్చి, "సదయాత్ములారా! పతివ్రతామానభంగము సేయ దీక్ష బూనుట పాడి యగునే! ధర్మవిరుద్ధముగాదా! తాపసుల కిది తగునా! జగములు తల్లడమందవే! జపతపస్స్వాధ్యాయములెట్లు నిర్వర్తింపంబడగలవు? త్రిమూర్తులు సమవర్తి శాసనమునకు లోను గారె? అభ్యాగతు లాతిథ్యము జిక్కక క్షుద్బాధాపీడితులు గారా! మర్త్యాంగన లధోగతి పాలు గాకుందురా! ఏటిదీక్ష? యిదేటి వ్రతము? భళిరే! మున్నెన్నడు నిట్టి వింతవ్రతముల గని వినియుంటిమే! కానిండు: క్షుధాతురులరగు మీ కాతిథ్యము నిచ్చెద; గైకొని పొండు; పరమేశ్వరార్పణముగా నే నొసంగు దానను; దాన నా పాతివ్రత్యమునకు భంగమొదవదు" అని బలికి, తనపతి కమండలోదకమును వారిపై జల్లెను. అప్పుడా మువ్వురు బాలకులైరి. మునిపత్ని వివస్త్రయై వారి నొక్కొక్కరి నెత్తి కొని ముద్దాడి, ఆవు పాల ద్రావించి, యుయ్యాల లందుంచి, లాలి పాడుచుండెను; ఇంతలో నత్రియే తెంచి బుడుతల గని, జరిగిన యుదంతంబాతయు

సతిచే నెరింగెను; సృష్టి స్థితి లయ కర్తలు మువ్వురు భక్తవత్సలతను బాలకులైరని సతికి దేటపరచెను.

దంపతు లిరువురును పరమానందమున భక్తి శ్రద్ధల నిసువుల బోషించుచుండిరి.

ఈ వార్త జగముల వ్యాపించెను. దిక్పాలు రాదిగా తాపసాశ్రమము జేరి, యనసూయ మహిమ బొగడి, ఆముప్పుర నాశ్రమమువీడి, స్వస్వరూపముల ధరించి స్వస్థానము ప్రవేశింప ప్రార్థింపుచుండిరి.

నారదు డీ వార్త ముగురమ్మలకు దెలుపగా వారు విషాద మొందిరి. పిదప వారు నిజమారయ నెంచి, బయల్వెడలి యనసూయను గాంచిరి; పరిచర్యల గొనిరి; యామెను పతి భిక్ష నడిగిరి; కాని యందులకు తాపస సతి సమ్మతింపదయ్యె.

అప్పుడాకాశ వాణి "యో యనసూయా దేవీ! త్రిమూర్తుల సతులకన్న పాతివ్రత్యంబున మిన్న యగుట స్పష్టపడియె; నీ విప్పుడు మూర్తిత్రయముల స్వ స్వరూపము లందజేయుము. లేదేని కీడు మూడుట సత్యము; సత్య" మని వచించెను.

అనసూయ పుత్రమోహమును విడువక బుడుతలపై జలము ప్రోక్షింప, వా రతిత్వరితముగ పూర్వ

రూపముల నిలచి, యా సాధ్వి వాంఛ దీర మూర్తి త్రయాంశముల నొప్పి, మూడు మొగములు, యారు భుజములు, రెండుపాదములు గల బాలకుని సృజించి అత్రి యనసూయలకు దత్తముజేసిరి. త్రిమూర్తుల కళ లొప్పియుండు యా బాలుని గని, తాపసాదు లెల్లరు నీ దత్తయోగి యోగివంద్యుడు, యోగఫలదాయకు డును, సర్వత్ర పూజనీయుడు నై వర్ధిలు గాత యని, యాశీస్సు లిడిరి.

అప్పుడు సురలు విరుల గురిపించిరి; మంగళ వాద్యముల ప్రమోయించిరి. దేవగాయకులు గానము సేసిరి. అచ్చర లాడిరి. గర్గాంగిరసులు బ్రహ్మచ ర్యమును స్వీకరింప జేసిరి. దేవాంగన లారతులెత్తిరి. మునిపత్నులు సుమహారముల ధరింపజేసిరి. అత్రియు ననసూయయు బాలకు నెత్తుకొని, చుంచు దువ్వి, చుబుకంబు పుడికి, శిరము నాఘ్రాణించిరి. దిక్పా లురు అమూల్యాభరణములు వస్త్రములు నొసంగిరి. ముని దంపతు లెల్లరికిని మృష్టాన్నము లొసంగి సంతు ష్టిం జెందించిరి. విచ్చేసిన వారెల్లరు పరమానందం బున మునిపత్ని మహిమ బొగడి, సెలవంది తమతమ

యునికిపట్టుల కరిగిరి. తదాదిగ దత్త యోగీంద్రుడు భక్తాభీష్టఫలప్రదుడై, త్రిభువనానందదాయకుడై, మంత్ర మంత్రార్థ బోధితాధ్యాత్ముడై, యుగ యుగంబుల వర్ధిల్లుచుండెను.

క. మురిపెమున దత్తు డనగా
బరగుచు, మహబూబు నగర వర మను జిల్లా
పరిగను తాలూకాకును
దరిగిరిపై నిలచితివిగ దత్తాత్రేయా.

క. రామేశ్వరగిరినిలయా!
కామితము లొసంగి కాచు కరుణాహృదయా
స్వామి పరాకేలనయా!
దామోదర బుధవిధేయ దత్తాత్రేయా.

క కామితఫలదా! మిథ్యా
భ్రామికము లొసంగి విడక పరమాదరణన్
నీ మహిమోన్నతి సుగుణో
ద్దాముడ గనజేయుమయ్య దత్తాత్రేయా.

క. అతికుతుకమునను దాసుల
హితమతి గాచెదవటనుచు యింపగు భక్తిన్
సతతము దలచెద యఘసం
తతి దర్ప మడంచుమయ్య దత్తాత్రేయా.

క. పురహరుడవనుచు నిను గన
నరుదెంచెను భక్తవరుల నత్యాదరణ౯
సిరి యశ మొసగగ శైలము
దరి నిలచిన తాపసేంద్ర దత్తాత్రేయా.

క. గరుడాళ్వారుల వాహన
మరుదారగ గలిగియుండి మానీంద్రుడవై
ధర రామేశ్వర వర గిరి
దరి నిల్చితి వబ్బురముగ దత్తాత్రేయా.

---

గీ. ఆది మధ్యాంత రహిత యధ్యాత్మసహిత
ఘనుడ యాహ్వానమంది సాక్షాత్కరించి
భక్తవాత్సల్యమున పుణ్యఫల మొసంగు
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి.

గీ. మంత్ర మంత్రార్థ బోధితా మ్నాయ యోగ
బలుడ సద్బ్రహ్మచారి కృపాసముద్ర!
స్వాంతమలరగ విచ్చేయు సదమలాత్మ!
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి.

గీ. సాంగ కృష్ణాజినంబు కుశాసనంబు
అక్షమాలాదుల ధరించి యర్ఘ్య రత్న
స్థగిత సింహాసనంబున దగవసించు
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి.

శ్రీ దత్తాత్రేయ మానసపూజ.

గీ. వేదవేద్యాఙ్గ పారగా వీతరాగ!
శంఖ చక్ర గదా శూల శార్ఙ్గ హస్త
ములకు నర్ఘ్యంబు లర్పింతు మునివరేణ్య
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి.

గీ. ఋగ్యజుస్సామ సూక్తుల రీతి వెలయు
జగ్గములను సంచరించు నీ చరణములకు
పాద్యమర్పింతు గొనుము షడ్భావ రహిత
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి.

గీ. గంగ గౌతమి కావేరి తుంగభద్ర
యమున నర్మద కృష్ణవేణ్యాది జలము
లాచమనమును సేయుము యమల చరిత
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి.

గీ. తైలముద్వర్తనంబును తాపసేంద్ర
దేహ ధావళ్యమునకునై దివ్యదేహ
మునకు నలదెద స్వీకారమందు మయ్య
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి.

గీ. దధి ఘృత క్షీర శర్కర మధువులిత్తు
నారికేళాది యోగ్య పంచామృతంబు
చేత నభ్యంజనము సేతు స్వీకరించు
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి.

# శ్రీదత్తాత్రేయ మానస పూజ.



గీ. ఘనతరం బగు మణికర్ణికా జలంబు
పరగ పన్నీరుచే స్నానభరితు నిన్ను
జేతు సద్భక్తి తోడుత చిదచిదాత్మ
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి

గీ. పీత వస్త్రము ధరియించు వెట్టి వగుట
ధౌత చేలము సర్పింతు దాల్చుమయ్య
యోగభాసుర యోగీశ యోగివంద్య
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి.

గీ. పూర్ణకళ లొప్పు మోముల ముచ్చటలర
గోపిచందనమును దీర్చి కురులు దువ్వి
నైరముడి వేసి విరిదండ వైచినాడ
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి.

గీ. ఆది యంత్యపు మొగముల నలదిబూది
నడిమి మొగమున శ్రీచూర్ణ నామ మిడితి
బ్రహ్మ విష్ణు సదాశివ భావ మలర
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి.

గీ. బ్రహ్మ సూత్రము బృహతికా బ్రహ్మ నిష్ఠ
వెలయ పునరాచ మనముకై విహిత జలము
దాసు డర్పించు యోగ సుత్రామవిభవ
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి.

గీ. హాయుగను నొప్పు మౌక్తిక హారములను
స్వీకరించియు దాల్చి ప్రసిద్ధముగను
సంతతానంద మొసగుము సంయమీంద్ర
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి.

గీ. స్వర్ణ మణిమయ భూషణా వళులు గలిగి
ఘనులు ధరియించు భావంబు ప్రజ్ఞ వెలయు
బిల్వ తులసియు మాల నర్పింతు గొనుము
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి.

గీ. పరిమళ సుగంధ మత్తరు పచ్చకపుర
పునుగు జవ్వాజి నీ దేహమునకు నలది
చామరము వీతు గైకొను సంతసమున
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి.

గీ. మల్లె గేదంగి నాగ చేమంతి పారి
జాత చమ్పక పున్నాగ జాజి కుసుమ
బిల్వ తులసియు నర్పింతు ప్రేమ గనుము
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి.

గీ. శాలితండుల కుంకుమా క్షతలు మంత్ర
పూర్వకముగ సమర్పింతు పుణ్యచరిత
భక్త దారిద్ర్య నాశన భవవిదూర
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి.

9/168



గీ. సర్వరస గుగ్గిలంబు దశాంగ సుగరు
సంయుతంబగు ధూపంబు సంతసమిగ్ర
పాండుర శరీర మెల్లెడ బ్రాక [illegible]
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి.

గీ. చందనాగరు గుగ్గిల సంయుతంబు
నగు దశాంగ ధూప సమర్పణంబు జేతు
దీనజనపోష గైకొని తృప్తి జెందు
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి.

గీ. యోగులకు యోగివై సర్వ భోగి వొప్పు
జ్ఞాన సంధాన యోగిహృజ్జలజమిత్ర
బాహ్యాదీప మంగీకార భావమలరు
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి

గీ. సూప మన్నంబు బహుశాక చోష్యములును
లడ్డు హోళిగ ఫేణి గులాబుజాము
యాదిగాగ పక్వాన్నము లారగించు
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి.

గీ. కదళి ఖర్జూర చూత ద్రాక్షయును పనస
బదరి దానిమ్మ నారికేళాది ఫలము
లర్పణము జేతు భక్షించు లక్షణముగ
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి.

గీ. నాగవల్లీ దళంబులు పూగిఫలము
జాతి యుత్కట పృథివికా యాదిమిళిత
విడెము మర్పింతు గైకొను వేదవిహిత
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి.

గీ. అర్హవిధమున కర్పూర హారతులను
నిష్కళంక నిరంజన నిర్మలాత్మ
నిర్గుణైశ్వర్య దాయక నీకు నిడెద
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి.

గీ. హ్రస్వ దీర్ఘ కృశ స్థూల రహిత! పంచ
భూతదీప్తికిని సమంత్ర పుష్పమిడెద
యజ్ఞ భోక్తృడ స్వీకార మందుమయ్య
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి.

గీ. జన్మ మృత్యు జరాది సంసరణ బంధ
ములను బాపెడి పురుషోత్తముడవు నీకు
భక్తితో నమస్కార మర్పణము సేతు
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి.

గీ. సర్వదేవాదిపూజిత శర్వ విష్ణు
ధాత హంశ ప్రదీప ప్రదక్షిణమును
సర్వపాపము శమియింప సల్పినాడ
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి.

గీ. చామరాందోళికము గొన సమ్మతించి
జగము పోషించు శ్రమ కొంత శాంతి నొంద
హెచ్చరిక నుండు మిచ్చోట యింపు తోడ
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి.

గీ. గానమభినయ నృత్తంబ మాన భక్తి
స్మరణ గావింతు నే వేళ సంతసమున
దోసమెన్నక గాంచుము దురిత హరణ
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి.

గీ. ముక్తి కాంతను గూడుక ముచ్చటలర
శత్రు సంహార మొనరించి జగతి దాస
రక్షణను జేయు నీకు నీరాజనంబు
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి.

గీ. యోగ ఫలదాయకా! సర్వ యోగములకు
ముఖ్యమగు శాంత మానస మొప్పు నీదు
యంఘ్రులకు నమస్కారములమల చరిత
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి.

గీ. తీర్థ యాత్రలు దిరెగెడి దేశికుండ
పూర్ణ ఫలమిచ్చి పోషించి భుక్తి ముక్తి
పరమ పద వాస యొసగుము భద్రముగను
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి.

౧౮-3 శ్రీదత్తాత్రేయ మానస పూజ.

గీ. సృష్టి పోషణ లయములు జేయు నట్టి
త్రైగుణంబుల నొప్పిన తాపసేంద్ర
శత్రు సంహార మొనరించు శక్తి జూపు
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి.

గీ. మూడు మూర్తుల యంశచే ముక్తి నొసగు
దాతవీవని భజియింతు దైవరాయ
తప్పులెల్లను విడనాడి దయను గావు
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి.

గీ. మంత్ర హీన క్రియా హీన మనక నాదు
పూజ నీకర్పణము సేతు ముదము గదుర
ప్రీతి గొను మయ్య యోగీశ వేద విదిత
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి.

గీ. జన్మ సంచిత కర్మ సంసరణ బంధ
భయము బాపెడి భావసంపత్ప్రభావ
భక్తి తాత్పర్యమును గని భద్ర మొసగు
ధాత్రి రామేశ్వర గిరీశ దత్తమూర్తి.

కం. మురహార శ్రీ ముఖ వత్సర
వర చైత్రము పౌర్ణవమికి వాంఛను దీరన్
పరిపూర్తి యాయె చరితము
ధరవర్ధిల జేయుమయ్య దత్తాత్రేయా!

---

# శ్రీ శివ భక్త విజయము

బాలురకు, స్త్రీలకు, వృద్ధులకు, యువకులకు, విద్యార్థులకు — భాషాజ్ఞానము కొఱకైనను, భక్తి కొఱకైనను, వినోదమున కైనను — చదువు కొన దగినయట్టి సర్వోత్తమ గ్రంథము ఇంతవరకు ఈ విధముగ ఎచ్చటను ప్రకటింప బడి యుండ లేదు.

ఉచితము ననుసరించి నవ రసములు, భక్తి తాత్పర్యములు విలసిల్ల ముద్దులు మూట గట్టునట్లు — ఎంత జదివినను, విసుగు బుట్టకుండు నట్లు ధారాళమైన శైలిలో నూటికెక్కువగా శివభక్తుల కథలు వర్ణింప బడినవి.

వె. 3 రూ. మాత్రమే, — పంచాక్షరీ ప్రెస్,
చౌట్లమహారాజుగంజు - హైద్రాబాదు (దక్కన్)